# తాతగారి పెన్సిలు

మైకేల్





వాళ్ల నాన్నకి అబ్బాయి ఉత్తరం రాస్తున్నాడు.

కొంచెం సేపటికి పెన్సిలు కింద పెట్టి నిద్రకి ఉపక్రమించాడు.



అమ్మకి ముద్దు పెట్టి శుభరాత్రి చెప్పాడు. అంతా ప్రశాంతంగా ఉంది. వెన్నెలలో ఇల్లు నిద్రపోతోంది. నిద్రలో అబ్బాయి కలలు కంటున్నాడు. కాగితం మీద పెన్సిలు ఉంది.



అప్పుడు బరబర, కరకర అంటూ శబ్దం అయ్యింది.
కాగితం మీద పెన్సిలు ఏదో రాస్తోంది.
"నాకు గుర్తుంది," పెన్సిలు రాసింది. "మొట్టమొదటసారి ఈ ఇంటికి వచ్చిన రోజు గుర్తుంది. స్నేహితులైన రంగు రంగుల పెన్సిళ్ల తోపాటు నేను ఒక పెట్టెలో ఉన్నాను. అబ్బాయికి బహుమతిగా మమ్మల్ని ఇచ్చారు."



“మమ్మల్ని కొన్న ఆ దుకాణం కూడా నాకు గుర్తుంది. అక్కడ అలమరాల నిండా సైనికుల లాగా వరసల్లో సిరా సీసాలు, రంగులు ఉన్నాయి."

“కాగితాలు – అక్కడ అనేక రకాల కాగితాలు ఉన్నాయి – పలచటవి, దొడ్డువి, చిన్నవి, పెద్దవి. ప్రపంచం నలుమూలల నుంచి వచ్చిన కాగితాలు అక్కడ ఉన్నాయి. రాత్రి వేళ చీకట్లో అవి ఎన్నెన్నో కథలు చెప్పేవి!"



"పెన్సిలు కాక ముందు మేం ఉన్న అడవి నాకు గుర్తు ఉంది. ఒక పొడవాటి చెట్టులోని భాగం నేను. కలల్లో ఇప్పటికి కూడా చిటారు కొమ్మలలోని గాలి తెలుస్తూ ఉంటుంది."

గదిలోని గాలికి కాగితం రెపరెప లాడింది. కాగితం తన కథ చెబుతుంటే పెన్సిలు రాస్తూ ఉంది...





“మనుషులు వచ్చి చాలా చెట్లను కొట్టటం నాకు గుర్తు ఉంది. దుంగలను లాగటం, నదిలో సాహసభరిత ప్రయాణం నాకు గుర్తు ఉన్నాయి,” కాగితం చెప్పింది.

“నాకు కూడా ఆ ప్రయాణం గుర్తు ఉంది," బల్ల కూడా ఇప్పుడు కథలో భాగం అయ్యింది. “ఉరకలెత్తే నీటిలో పడి లేవటం, రంపపు కొత చప్పుళ్లు కూడా నాకు గుర్తు ఉన్నాయి.”

“వడ్రంగం దుకాణంలో ప్రేమతో ఒకతను నన్ను ఈ రూపంలో తయారు చేశాడు."



కాగితం కథని పెన్సిలు రాస్తుండగా గదిలో నిశ్శబ్దం అలుముకుంది.
“అడవిలోని ఆ రోజులు గుర్తు ఉన్నాయా?" కిర్రుమని తెరుచుకుంటూ తలుపు అడిగింది. “మన కోరికలు, మన కలలు? అడవిలోనే క్షేమంగా ఉంటామా, లేక లోకం అంతా తిరుగుతామా? మనం చాలా దూరం వచ్చాం, కానీ ఈ అబ్బాయి జీవితం అంతా ముందే ఉంది.”
నిద్రలో అబ్బాయి కొంచెం మెదిలాడు.
గదిలో నేలమీద వెన్నెల పరుచుకుంది.





"మీ కంటే మేం చాలా దూరం ప్రయాణించాం," నేలలోని కొయ్య పలకలు అన్నాయి. "ఈ ఇల్లు కట్టక ముందు నల్లని జెండా, ఊదా తెరచాపలు ఉన్న పెద్ద ఓడలో భాగంగా ఉండేవాళ్లం."

"మాకు తారు పట్టించేవాళ్లు. తెరచాపలలో గాలి, అలల ఆటుపోట్లు ఇప్పటికీ గుర్తుకొస్తాయి. ఆ గాలులను మళ్లీ చవిచూడాలని ఉంది!"



"ఆ గాలిని చవి చూద్దువు గాని," అంటూ పాత కొయ్య కిటికి తెరుచుకుంది.

రాత్రి గాలి పిచ్చిదానిలా గదిలో సుడులు తిరిగింది.

కళ్లల్లో ఉత్సాహం మెరుస్తుండగా అబ్బాయి లేచి కూర్చున్నాడు. బొందుల మీద తలుపు ఉయ్యాలలూగింది. పెన్సిలు దొర్లుకుంటూ కిందపడి వెన్నెలలో ఈదులాడుతోంది. కాగితం కిటికీలోంచి బయటకు ఎగిరింది.



పట్టణం దాటి అది ఆకాశంలో పల్టీలు కొడుతూ అడవిని చేరి ఒక చెట్టు చిటారు కొమ్మలో చిక్కుకుంది.



పెన్సిలు, కాగితం, తలుపు, నేల పలకల కథలను గాలి ముక్కలు ముక్కలు చేసి నేల మీదకి వేసింది.

పక్షులు ఆ కథల ముక్కలను తమ గూళ్లల్లో అల్లాయి, తమ పిల్లలకు ఆ కథలను చెప్పాయి. అడవిలోని జంతువులన్నీ ఆ కథలను విన్నాయి. చెట్ల చిటారు కొమ్మల ఆకుల నుంచి లోతైన వేళ్ల వరకు అన్నింటికీ ఆ కథలు తెలిశాయి. ఆ కథలు తమ ఇల్లైన అడవికి తిరిగి చేరుకున్నాయి.





ఎంతో జీవితం ఉన్న ఆ అబ్బాయి సంగతి
ఏమిటి?

ఆ అబ్బాయి పెద్దవాడు అయ్యి ఓడల
మీద సముద్రాలన్నీ తిరిగాడు.



ప్రయాణం చెయ్యలేనంత ముసలివాడు అయినప్పుడు సముద్రం పక్కన  కలప ఇంట్లో ఉండసాగాడు. తన మనవడు జాక్‌కి కథలు చెప్పసాగాడు. రాత్రిళ్లు కలల సముద్రంలో తేలియాడేవాడు.

తలుపు ఉయ్యాల ఊగి, ములుకు మీద పెన్సిలు నిలబడి చివరికి మాయమైన రాత్రి నాటి కథ జాక్‌కి చెప్పాడు.

“అది పట్టణంలోని మీ ఇంట్లోనే, నీ గదిలోనే జరిగింది, జాక్."





పట్టణంలోని తమ ఇంటికి తిరిగి వచ్చిన తరవాత

జాక్ ముందుగా తన గదిలోకి వెళ్లాడు.



అతడు నేల మీద పడుకుని కొయ్య పలకల మధ్య వెతికాడు. అంతా చీకటిగా ఉండటంతో అతడికి ఏమీ కనపడలేదు.

ఒక హ్యాంగర్‌ని తిన్నగా చేసి దానితో సందుల మధ్య కెలికాడు. పోయినవనుకున్న తనవే ఎన్నో వస్తువులు అతడికి దొరికాయి. చివరికి అతడికి ఒక పాత పెన్సిలు దొరికింది!





ఆ పెన్సిలుతో రాసి చూశాడు, అది ఎంతో అందంగా రాసింది. శెలవలు సంతోషంగా గడిపానంటూ తాతకి ఉత్తరం రాశాడు. చివరలో, “ఆ పెన్సిలు దొరికింది!” అంటూ ముగించాడు.

అమ్మ ముద్దు పెట్టి అతడిని బజ్జో పెట్టింది. అతడు వెంటనే నిద్రలోకి జారుకున్నాడు.

కాగితం మీద పెన్సిలు ఉంది, అంతా ప్రశాంతంగా ఉంది.



బరబర బరబర! పెన్సిలు రాయటం మొదలు పెట్టింది.
“చాలా సంవత్సరాలు నేను చీకటిలో పడి ఉన్నాను.
అక్కడ నాతో పాటు మెలి తిరిగిన పెన్ను, ఒక వెండి
నాణెం, తిమింగలం ఎముకతో చేసిన గుండీ ఉన్నాయి.
అవి చాలా కథలు చెప్పాయి. గుండీ తిమింగలంలో
భాగంగా ఉన్నప్పుడు...”
...అయితే అది మరొక కథ అవుతుంది.

అయిపోయింది